## గంటల పంచాంగం

శ్రీ దుర్ముఖ సం॥ చైత్ర బ॥ చతుర్థి 1956- సం॥ ఏప్రిల్ 29 ఆదివారం. తి॥ చతుర్థి 12-3 మూల ఫూర్తి వర్జ్యం 13-36 ల 15-22 వ.
బ॥ పంచమి ఏప్రిల్ 30 సోమవారం తి॥ పంచమి 14-24 మూల 7-28 వర్జ్యం 5-41 ల 7-28 వ. ఫ్రస వర్జ్యం 18-17 ల 20-5 వ.


# ఆంధ్రపత్రిక

ఓరి వేయని యొనరించిన
వరవర ద్యుతియును రవ మనంబున రగుదా
సౌరులకు వనిచేయుచుండి
వరాయుమ పరమదిర్వ పథముల కెల్లన్
(మహాభారతము)

శ్రీ దుర్ముఖ సం॥ చైత్ర బ॥ చతుర్థి
ఆదివారం


## ఆయుర్వేదం

ఆయుర్వేదం క్రమబద్ధమైన శాస్త్రం. ఇది కేవలం చికిత్సా ప్రక్రియకు సంబంధించిన శాస్త్రం మాత్రమే కాదు. రోగ చికిత్సకు ఇది ఎంత ప్రాధాన్యం ఇస్తుందో, నిత్యజీవితానికి సంబంధించిన ఆహారవిహారాది కార్యక్రమాలలో మానవుడు పాటించదగిన ఆరోగ్య సూత్రాలకు కూడా అంతే ప్రాధాన్యం ఇస్తుంది. అందుచేతే పాశ్చాత్యులు కేవలం వైద్యశాస్త్రమని పిలుచుకుంటే, మనం మన శాస్త్రాన్ని ఆయుర్వేదమని పిలుచుకుంటున్నాము. ఆయుర్వేదం అసలు శాస్త్రమే కాదని ఎవరైనా వాదిస్తే, వారు తమను తామే న్యూనత పరుచుకుంటున్నారని చెప్పవలసివస్తుంది. కాల పరీక్షకు నిలవగలిగిన ఏ సిద్ధాంతానికైనా, ఏ మానవానుభవానికైనా శాస్త్రంలో స్థానం ఇవ్వకతప్పదు. పాశ్చాత్య శాస్త్రాల క్రోడీకరణ అంతా ఈవిధంగా జరిగిందే. ఆయుర్వేదం భారత దేశంలో తరతరాలుగా కఠిన కాలపరీక్షలకు తట్టుకొని నిలవ గలిగిన అతి ప్రాచీన దేశీయ వైద్యశాస్త్రం. ఇది మనకు కేవలం ఒక శాస్త్రమే కాదు; ఒక జీవిత విధానం. దీన్ని కాదనడం ఎవరి తరంకాదు.

అయితే, ఒక విషయం. దేశ అస్వతంత్ర జీవితంలో భారతీయ లలితకళలు, శాస్త్రాలు అనేకం నాశనమై మరుగున పడిపోయినట్లే, తగిన ప్రోత్సాహం గాని, ఆదరణ గాని లేక మన దేశీయ వైద్య విధానం కూడా కొంతవరకు మరుగున పడిపోయింది. పాశ్చాత్య వైద్య విధాన ప్రభావ వ్యామోహాలు మనలో కొందరికు ఎక్కువైనవి. ఇంత మాత్రం చేత దేశీయవిధానాన్ని పాశ్చాత్య విధానం నామరూపాలు లేకుండా చేసివేసిందనిగాని, చేసివేస్తుందనిగాని చెప్పడం సాహసమే అవుతుంది. సువిశాలమైన మన దేశంలో అసంఖ్యాక ప్రజానీకం ఆపన్నసమయంలో దేశీయ వైద్యవిధానంమీద ఆధారపడవలసివస్తుందనే విషయాన్ని మరచిపోకూడదు. ఈవిధంగా ఆధారపడుతున్న ప్రజల ఆదరణను, అభిమానాన్ని కోల్పోకుండా ఆయుర్వేద శాస్త్రం [illegible] మాట వాస్తవం.

ఈ క్రమాన్ని [illegible] కుండా మన [illegible] చేస్తున్నారన్న [illegible] ప్రధానమైన [illegible] మొన్న [illegible] జరిగిన రాష్ట్ర ఆయుర్వేద పరిషత్తు వార్షిక సభకు అఖిల భారత ఆయుర్వేద కాంగ్రెస్ అధ్యక్షుడు పార్థసారాయణ పండిత్ ప్రభృతులు హాజరైనారు. ఆంధ్రలో ఆయుర్వేద కళాశాలను స్థాపించాలనీ, ఆయుర్వేద వైద్య కేంద్రమునుండిలని ఏర్పరచాలనీ ప్రభుత్వాన్ని అభ్యర్థించడంతో మహాసభ సమాప్తమైంది. చేయదలచుకున్నది ఈ తీర్మానాలే అయితే, ఇంత పెద్ద ఎత్తున వార్షిక సభ జరపవలసిన అగత్యమే లేదు. ఇవి ప్రతి వార్షిక సభలోనూ చేస్తున్న విజ్ఞప్తులే.

ఆయుర్వేద వైద్య విధానానికి ప్రభుత్వ పరిగణ లభ్యమయ్యేట్లు చూసుకోవలసిందే. పాశ్చాత్య వైద్యవిధానంతో పోల్చిచూస్తే దేశీయ వైద్య విధానం ఎంతో వెనుకబడి వున్నదనే విషయాన్ని ఎవరూ కాదనలేరు. ద్వితీయ ప్రపంచ యుద్ధ సమయంనుంచీ పాశ్చాత్య వైద్యవిధానం అమోఘమైన అభివృద్ధిని సాధించగలిగింది. మన విధానం ఎప్పుడో కొన్ని వేల సంవత్సరాల క్రితం ఏ స్థితిలో వున్నదో, నేటికీ అదేస్థితిలో వున్నది. ఏ విధమైన నూత్న పరిశోధనలు జరగకపోవడమే ఇందుకు కారణం కాదా? నూత్న పరిశోధనల మాట అలావుంచి నప్పటికీ, దేశవ్యాప్తంగా కుక్కగొడుగుల వలె ఏవేవో పేర్లతో తయారవుతున్న పలురకాల ఔషధాలకు స్థిరమైన ప్రమాణాలను వేటినైనా నిర్ణయించడానికి ప్రయత్నించామా? ఎప్పుడో కొన్ని వేల సంవత్సరాల క్రితం చేసిన సూత్రనిర్వచనాలు ఆధునిక కాల పరిస్థితులకు ఎంతవరకు అనుసరణీయమైనవో పునఃపరిశీలన చేసుకున్నామా? ప్రభుత్వ ఆదరణగాని ప్రోత్సాహంగాని లేకుండానే దేశీయ వైద్య విధానాభివృద్ధికి జరగవలసిన పని ఎంతో వున్నది.

ప్రభుత్వ ప్రోత్సాహం వుంటేనే దేశీయ వైద్య విధానంలో నూత్న పరిశోధనలు సాగించడం సాధ్యమనే విషయంకూడా విశ్వసించదగినదికాదు. ఉద్దండులనదగిన ఆయుర్వేద పండితులు దేశంలోనే గాక, మన రాష్ట్రంలోనూ వున్నారు. వారందరూ కలసి ఎందుకు పరిశోధన చేయకూడదు? కలసి కట్టుగా ఏదైనా కృషిని ప్రారంభించి నప్పుడు ప్రభుత్వ సహాయం విధిగా దానంతటదే లభ్యమవుతుంది. మనస్సును ఎప్పుడైతే లగ్నం చేస్తామో, అప్పుడే మార్గాంతరం కూడా కనబడితీరుతుంది. ఆయుర్వేద వైద్యులు తమ అపూర్వానుభవ జ్ఞానంతో, ఆత్మవిశ్వాసంతో ముందంజ వేయగలరని ఆశిస్తున్నాము.

## ఆంధ్రలో హిందీ మహాసభ

### అధ్యక్షత వహించడానికి రాష్ట్రపతి అంగీకారం

న్యూఢిల్లీ, ఏప్రిల్ 27: జూన్, జులై నెలలో ఆంధ్రలో హిందీ మహాసభ రాష్ట్రపతి రాజేంద్రప్రసాద్ అధ్యక్షతన జరుగుతుంది.

ఆంధ్రరాష్ట్ర హిందీ ప్రచారసంఘ కార్యదర్శి శ్రీ ఉన్నవ రాజగోపాల కృష్ణయ్య మొన్న రాష్ట్రపతిని సందర్శించి, ఈ మహాసభకు అధ్యక్షత వహించవలసిందని కోరగా రాష్ట్రపతి అందుకు అంగీకరించారు.

ఆంధ్ర ప్రాంతంలో హిందీ ప్రచార సేవ, అభిమానులు ఈ సదవకాశాన్ని వినియోగించుకొని, రాష్ట్రపతికి ఘన [illegible] శ్రీ రాజగోపాలకృష్ణయ్య విజ్ఞప్తి చేస్తున్నారు.

## పత్రికా రచయితల వేతనాలు

### లోక్ సభలో చర్చ

న్యూఢిల్లీ, ఏప్రిల్ 27: పత్రికలలో పనిచేసే రచయితల వేతనాలను పత్రికా రచయితల చట్టం ప్రకారం నిర్ణయించేందుకు నియమించే వేతనాల నిర్ణాయక సంఘంలో ఎవరెవరు సభ్యులుగా ఉంటేదీ వచ్చేవారం భారత ప్రభుత్వం ప్రకటిస్తారు.

లోక్ సభలో కార్మిక మంత్రి శ్రీ ఖండూభాయ్ దేశాయ్ నేడు ఈ విషయం చెప్పారు.

ఈ విషయమై లోక్ సభలో నేడు అరగంట చర్చ జరిగింది. చట్టం ప్రకారం రూపొందించవలసిన నిబంధనలను త్వరగా రూపొందించి తుది నిర్ణయం జరిగేలోగా ఇవ్వవలసిన వేతనాలను నిర్ణయించేపని, చట్టంలోని ఇతర అంశాలకు సంబంధించినపని త్వరగా చేయించమని చర్చను ప్రారంభిస్తూ డాక్టర్ లంక సుందరం కోరారు.

తాత్కాలిక వేతనాలను నిర్ణయించే ఉద్దేశం ప్రభుత్వానికి లేదని కార్మిక శాఖ ఉపమంత్రి ఇటీవల చెప్పిన సమాధానాన్ని బట్టే అనుకోవలసి వస్తోందని డాక్టరు సుందరం అన్నారు.

వేతనాల నిర్ణాయక సంఘంలో యజమానులకు ఉద్యోగులకు ప్రాతినిధ్యం ఉంటుంది; తాత్కాలిక వేతనాలను నిర్ణయించే విషయం ఆ సంఘానికి వదిలివేశామని శ్రీ దేశాయ్ సమాధానం చెప్పారు. వారి సిఫార్సులకు ప్రభుత్వం తగినంత ప్రాముఖ్యమిస్తుందని చెప్పారు. ఇంకా ఇట్లా అన్నారు: "వేతనాల నిర్ణాయక సంఘంలోని ఉభయపక్షాల ప్రతినిధులు ఒక వారం రోజులలో సమావేశమవుతారు. తుదినిర్ణయం జరిగేలోగా ఇవ్వవలసిన వేతనాలను వారు పర్చించి ఉభయులకు ఆమోదయోగ్యమైన ఏర్పాటు చేయవచ్చు. పత్రికా రచయితల చట్టం ప్రకారం అమలు జరపవలసిన నిబంధనలు తయారవుతున్నవి. ఈ సమావేశం ముగిసేలోగా నిబంధనలను సభకు అందచేస్తాం."

"ప్రూఫ్ లు" దిద్దేవారి సంగతి ఏమి చేశారని డాక్టరు లంక సుందరం, శ్రీ హెచ్. వి. కామత్ ప్రశ్నించారు. చట్టంలోని (2) (ఎఫ్) నిబంధన ప్రకారం "ప్రూఫ్ లు" దిద్దేవారిని కూడా పత్రికా రచయితలుగా పరిగణించాలని ఉన్నా వారిని పత్రికా రచయితలుగా చేర్చమని న్యాయశాఖ మంత్రి ఆ భాగానికి అర్థం చెప్పారు. అందువల్ల డాక్టరు సుందరం, కామత్ ఇట్లా ప్రశ్నించారు.

సమాచారశాఖ మంత్రి డాక్టరు బి. వి. కేస్కర్ ఇట్లా చెప్పారు: "చట్టాన్ని సభ ఆమోదించక పూర్వం పత్రికా రచయిల రాయబారవర్గం వెంకటి నన్ను కలుసుకుని చాలా పత్రికలలో పత్రికారచయితలు "ప్రూఫ్ లు" దిద్దేవారుగా పనిచేస్తున్నారని, వారికి కూడా చట్టాన్ని వర్తింపచేస్తే గాని న్యాయం జరగదని వివరించారు. ఏమైనా పత్రికా రచనయే ప్రధాన వృత్తిగా ఉన్నవారు మాత్రమే పత్రికా రచయితలవుతారన్నంతవరకు చట్టంలోని నిర్వచనం స్పష్టంగా వున్నది. "ప్రూఫ్ లు" దిద్దేవారి ప్రధానవృత్తి పత్రికా రచన అయితేతప్ప వారిని చట్టంలో చేర్చడానికి సాధ్యం కాదు."

ఆ తర్వాత కార్మికశాఖమంత్రి ఇట్లా చెప్పారు:

"న్యాయశాఖ మాకు సలహా ఇస్తుంది. ఈ వ్యాఖ్యానంతో విభేదించవలసి వస్తైనా ఉంటే న్యాయస్థానానికి వెళ్లి వ్యవహారాన్ని పరిష్కరించుకోవచ్చు. పత్రికలలో పనిచేయడమే ప్రధాన వృత్తిగా ఉండాలనేది ముఖ్యం."

ఆ తరువాత ఏప్రిల్ 30వ తేదీకి సభ వాయిదా పడ్డది.

ఏప్రిల్ 11వ తేదీన కార్మికశాఖ మంత్రి, ఉపమంత్రి చెప్పిన సమాధానాల కారణంగా నేడు ఈ విషయమై అరగంట చర్చ జరిగింది. మంత్రులు ఆనాడు చెప్పిన సమాధానాలు చాలా అసంతృప్తికరంగా ఉండటమేగాక, చట్టాన్ని అమలు చేయడంలోని ఉద్దేశాలను గజిబిజి చేసినవని, పత్రికా రచయితలకు చాలా నష్టం కలిగించినవని డాక్టరు సుందరం ఆరోపించారు. ఆ తర్వాత న్యాయశాఖ అనవసరంగా కల్పించుకుని "ప్రూఫ్ లు" దిద్దేవారిని చట్టంలో చేర్చ నవసరం లేదని అర్థం చెప్పిన విషయాన్ని డా॥ సుందరం నిశితంగా విమర్శించారు.

ఇటువంటి వ్యవహారాలలో న్యాయశాఖ మాట తిరుగులేనిది కావాలని శ్రీ కె. పి. శర్మ విమర్శించారు.

"ప్రూఫ్ రీడర్" అనే మాటను చట్టంలో చేర్చడం ఎట్లా జరిగినది సమాచారశాఖమంత్రి డాక్టరు కేస్కర్ ఇట్లా వివరించారు: "మొదట తయారైన బిల్లులో 'ప్రూఫ్ లు' దిద్దేవారిని చేర్చలేదు. ఆ తరువాత అనేక సందర్భాలలో ఒక్కొక్క వ్యక్తే ఉపసంపాదకత్వం, ప్రూఫ్ లు దిద్దటం వంటి పను లనేకం చేస్తున్నారని ఒక రాయబారవర్గం నాకు వివరించారు. అందువల్ల 'ప్రూఫ్ లు' దిద్దేవారిని బిల్లునుంచి వదిలివేయరాదని అనుకున్నాం. ఆ రాయబారవర్గంతో మాట్లాడిన తరువాతనే 'ప్రూఫ్ లు' దిద్దేవారిని పత్రికా రచయితల బిల్లులో చేర్చడం జరిగింది."

పత్రికా రచయితలకూ, యజమానులకూ వచ్చే వివాదాలను న్యాయస్థానాలకు వెంటనే పరిశీలనకు పంపించే పనులు పత్రికా రచయితలు, యజమానులు, ప్రభుత్వ ప్రతినిధులు కలిసి కూర్చుని పరిష్కరించుకునే పద్ధతిని అమలు జరిపితే బాగుంటుందని శ్రీ సి. ఆర్. నరసింహన్ సూచించారు.

చర్చకు సమాధానం చెబుతూ చట్టాన్ని అమలు జరపడానికి నిబంధనలు అంత ముఖ్యం కావని కార్మికశాఖ మంత్రి శ్రీ ఖండూభాయ్ దేశాయ్ అన్నారు. ఇంకా ఇట్లా వివరించారు. "1955 డిసెంబరు 20 నుంచి చట్టం అమలులోకి వచ్చింది. ఇబ్బందులేమైనా వచ్చి ఉంటే రాష్ట్రప్రభుత్వాల దృష్టికి తేవచ్చు. ఉండాలి-సెలవులు, ఉద్యోగంలో పనిచేసేనందున వచ్చే సెలవులు వంటి వ్యవహారాలను సంబంధించిన కొన్ని కొన్ని నిబంధనలను తయారు చేయవలసి ఉన్నది. ఈ టన్నింటికి సంబంధించిన అంశాలు కొన్ని చట్టంలో ఉన్నవి. నిబంధనలు వచ్చేవరకు వాటినే అనుసరించాలి."

పాతే వేతనాల నిర్ణాయక సంఘంలో ఎవరెవరిని నియమించవలసినదీ నిర్ణయించడానికి కొంత తీవ్ర వత్తిడి పట్టింది. మొదట అనుమానానికి నియమించుదామని అనుకున్న అధ్యక్షుడు ఆ తరువాత ఆపదవిని నిరాకరించారు. కనుక అధ్యక్షుడుగా ఎవరిని నియమించాల్సిందీ నిర్ణయించాలి. సంఘంలో చేర్చవలసిన ప్రతినిధుల పేర్లను సూచించే విషయమై వివిధ సంఘాలతో ఉత్తర ప్రత్యుత్తరాలు జరపాలి. ఆతర్వాత వారు సూచించే వ్యక్తుల ఆమోదంకూడా పొందాలి. మొత్తం అందుకు ఆమోదం చిన్న పాయం కాలం వచ్చింది."

"వేతనాలను నిర్ణయించేందుకు ఇంకా కొంత వ్యవధి కావాలని వేతనాల నిర్ణాయక సంఘం భావించితే తాత్కాలిక వేతనాలను వారు సూచించవచ్చు"

"అన్యాయమేమైనా జరిగితే పత్రికా రచయితలు దరఖాస్తులు పెట్టుకుని న్యాయం జరిగించుకోవచ్చు."

దేశమంతటా ఎన్నికలు జరుగనున్న సందర్భంలో రాజకీయ పెత్తందార్లు, పత్రికల వారు ఏదో ఒడంబడిక జరుగనున్నదని శ్రీ హెచ్. వి. కామత్ ఆరోపించారు. తుది నిర్ణయాలు జరిగే వరకు ఇవ్వవలసిన వేతనాలను నిర్ణయించుకొమ్మని సమాచారశాఖ పత్రికా రచయితలతో ఒడంబడిక చేసుకున్నారని చెప్పి అటువంటి ఒడంబడిక అంటే ఎందుకు మన్నించరాదని శ్రీ కామత్ ప్రశ్నించారు.

'ప్రూఫ్ లు' దిద్దేవారికి ఇవ్వవలసిన వేతనాల విషయాన్ని కూడా వేతనాల నిర్ణాయక సంఘం పరిశీలనకు పంపిస్తారా అని శ్రీ శివన్ చంద్ర గుప్త ప్రశ్నించగా కార్మికశాఖ మంత్రి సమాధానమివ్వలేదు.

పత్రికా రచయిత లెవరైనా తమ చిక్కులను ప్రభుత్వానికి చెప్పుకున్నారాలని శ్రీ డి. సి. శర్మ అడిగా అటువంటి చిక్కుల నివారణోపాయాలు చట్టంలో పేర్కొన్నామని, వాటి ప్రకారం వ్యవహరించడమే కర్తవ్యమని శ్రీ దేశాయ్ చెప్పారు.

## ఒంగోలులో పన్నుల భారం

### ప్రాంతీయ ఇన్ స్పెక్టరుకు విన్నపం

ఒంగోలు, ఏప్రిల్ 27: స్థానిక సంస్థల ప్రాంతీయ ఇన్ స్పెక్టరు (విజయవాడ) శ్రీ ఎస్. అంకన్న యీనెల 23, 24 తేదీలలో ఇక్కడికి వచ్చి, పురపాలక సంఘ కార్యాలయాన్ని తనిఖీ చేశారు.

ఆ సందర్భంలో, పట్టణ సంక్షేమ సంఘం తరపున పన్ను చెల్లించేవారి తరపున శ్రీ అంకన్నకు ఒక వినతిపత్రం సమర్పించారు.

ఈ పట్టణంలో, ఇటీవల సవరించిన పన్నులు దుర్భరంగా ఉన్నవని, పట్టణంలో నీటిసరఫరా అభివృద్ధికి అధికారులు తగుచర్యలు తీసుకోవాలని అందులో కోరారు.

శ్రీ అంకన్న, ఈ వినతిపత్రంలోని కోర్కెల విషయంలో తగుశ్రద్ధ తీసుకొంటానని హామీ యిచ్చారు.

## పందిరి కూలి పిల్లవాని మరణం

ఒంగోలు, ఏప్రిల్ 26: కొత్తపట్నం గ్రామంలో, ఒక ఆసామీ యింట పందిరి కూలడంచేత, ఆ పందిరిక్రింద ఆడుకొంటూవున్న ఇద్దరు పసిపిల్లలలో రామలింగస్వామి అనే 8 ఏళ్ల పిల్లవాడు చనిపోయాడు. ఇంకో 4 ఏళ్ళ వాడు తీవ్రంగా గాయపడ్డాడు.

ఆ పిల్లలిద్దరూ పందిరి ఎక్కి ఉట్టి పాయును ఆరబోస్తూ ఉండగా పందిరి కూలి ఈ ప్రమాదం సంభవించింది.

## అశోక స్తంభం ముద్రలేని నోట్లు

### ఆరునెలల తర్వాత చెల్లవు

న్యూఢిల్లీ, ఏప్రిల్ 28: అశోక స్తంభం ముద్రలేని కరెన్సీనోట్లు యీనాటినుండి ఆరునెలలు గడిచిన తర్వాత రిజర్వుబ్యాంకుమ, ప్రభుత్వ [illegible] [illegible] అని ఆర్థిక మంత్రిత్వశాఖ ఇవాళ ప్రకటించింది.

## పుష్కరాల సన్నాహాలు

### శ్రీ వెంకటరావు తనిఖీ

రాజమండ్రి, ఏప్రిల్ 27: సర్వీసుల మంత్రి శ్రీ కళా వెంకటరావు నిన్న కొత్తపేటనుంచి వచ్చారు. పురపాలక సంఘాధ్యక్షులు శ్రీ పోతుల వీరభద్రరావు, కలెక్టర్ శ్రీ ఎ. కృష్ణస్వామి, డిప్యూటీ కలెక్టర్ శ్రీ వి. శివనాచారి, ఆంధ్రరాష్ట్ర ప్రజారోగ్యశాఖ డైరెక్టర్ శ్రీ జగపల్లి సుబ్బారావు, పట్టణ కాంగ్రెసు అధ్యక్షులు శ్రీ నలమూరి సోమరాజు వారిని కలుసుకున్నారు.

ఆర్యాపురం-కలప అడితీలమీదుగా వెళ్లి, యాత్రికులకోసం నిర్మిస్తున్న 'పుష్కరనగరం' శిబిరాలను పరిశీలించి, అక్కడ ఏర్పాటుచేయనున్న తంతితపాలా-వైద్య ఆరోగ్య-నీటి సరఫరా ఏర్పాటుల విషయం రక్షణ రవాణా సౌకర్యాల సమస్యలూ తెలుసుకున్నారు.

తర్వాత కోటిలింగ క్షేత్ర ఘటం రేవువద్ద మెట్లు కట్టడాన్ని పరిశీలించారు. అభివృద్ధి కార్యక్రమాల అసిస్టెంటు యింజనీరు శ్రీ పునీలి వెంకట సుబ్బరాజు రెండు మూడు రోజులలో పని పూర్తవుతుందని చెప్పారు.

శ్రీ ఆలపాటి భాస్కరరామయ్య తోటలో భిక్షుకులకు యేర్పాటు చేసిన కుటీరాలు చూచారు. భిక్షుకులు పుష్కరకాలంలో నగరంలో తిరుగకుండా వారికి భోజనయేర్పాట్లు ఎట్లు చేస్తున్నారో సబుకలెక్టరు వివరించారు.

### పరిశ్రమలు కావాలంటే చేయవలసిన పని

రహదారీ బంగళాలో వారిని కలుసుకొని స్థానికులు కొందరు 'పారిశ్రామిక నగరాలు' యేర్పాటు చేయాలని కొన్ని విజ్ఞప్తుల సమర్పించారు. శ్రీ వెంకట్రావు కాగితాలపై అంకెలు వేసి చూపి నంత మాత్రాన ప్రభుత్వం ఆర్థిక సహాయం చేయదనీ, ఏ పరిశ్రమ స్థాపనకైనా ఎంత మొత్తం కావాలో అందవా వివరాలిస్తూ - అందులో సగం మొత్తం బ్యాంకులో నిల్వచూపిస్తూ - ఆ పరిశ్రమ ఆ ప్రాంతంలో వడిపటానికిగల సౌకర్యాలు (ముడిసరుకులు వ్యయ కరణం వగైరా) నివేదిస్తే - అప్పుడు పారిశ్రామిక వాణిజ్య పెట్టుబడిసంస్థ ద్వారా సహాయం చేయగలుగుతామన్నారు.

### స్టేషన్ లో ఒక సంఘటన

శ్రీ వెంకట్రావు కర్నూలుకు వెళ్లేదానికి రాజమండ్రి స్టేషనులో మొదటి తరగతి పెట్టెలో కూర్చున్న తర్వాత రైలుకదిలే యీలవేసేవరకూ పెట్టెవద్ద నిలచివున్న జవాను శ్రీ లోకయ్య తొందరగాపోయి దగ్గరలో కన్పించిన రెండవ తరగతి పెట్టెలో ఎక్కగా— అందులో ప్రయాణంచేస్తున్న దక్షిణ రైల్వే టికెట్లిచ్చే గుమాస్తా శ్రీ సి. వి. సుబ్రహ్మణ్యం అనే ఆయన అది రిజర్వు చేసిన పెట్టె అనీ అందులో ఎక్కటానికి వీలులేదనీ అభ్యంతరం పెట్టినారట! శ్రీ లోకయ్య తాను మంత్రి జవానునని తనను లోనికి రానీయవలసిదనీ, రైలు కదిలినదనీ చెప్పుచున్నాడట! ఘర్షణ జరిగింది. శ్రీ లోకయ్యను బయటకు నెట్టివేశారు. అతడు గోదావరి స్టేషన్ వరకూ ఫుట్ బోర్డుపై ప్రేలాడుతూ ప్రయాణించి - అక్కడ దిగి మంత్రికి చెప్పగా, ఆయన క్రిందకు దిగివచ్చి అమానుషంగా ప్రవర్తించిన రైల్వే ఉద్యోగిని వివాట్లు చేసి, తమ జవానును పోలీసులకు రిపోర్టు యివ్వమన్నారనీ, లోకయ్య ఆ రైల్వే ఉద్యోగిమీద తనపై దౌర్జన్యం చేశాడని రిపోర్టు యిచ్చినట్లూ తెలిసింది. మా వివేకరి తర్వాత వెళ్ళి గోదావరి రైల్వేపోలీసు చౌకీలో విచారించగా, ఆ రైలే సమాన్నాను ఆతినిషిద్ధకల నగదు పూచీకత్తుపై ఏజం చెప్పారు. దరిమిలా ఆయనను స్థానిక ప్రభుత్వాసుపత్రికిపరీక్షార్థం తీసుకొనివెళ్లారు. యీ ఉదయం విచారించగా వారిని గతరాత్రి జామీనుపై విడుదలచేసినట్లు తెలిసింది.

(స్వ. వి.)

## గ్రామాధికార్లకు ప్రయాణ ఖర్చులు

### ఇప్పించమని వినతి

కనిగిరి, ఏప్రిల్ 22: ప్రభుత్వ పనులపై గ్రామాధికారులను వారి గ్రామాల నుంచి ఇతర ప్రాంతాలకు పిలిపించినప్పుడు ప్రయాణ ఖర్చులను ఇప్పించమని ప్రభుత్వాన్ని కోరుతూ కనిగిరి తాలూకా గ్రామోద్యోగుల సభలో తీర్మానించారు. సభకు శ్రీ దేవిరెడ్డి ఒబ్బిరెడ్డి అధ్యక్షత వహించారు.

ఓటర్ల లిస్టులను తయారుచేయడానికి ప్రత్యేక సిబ్బందిని నియమించమని, లిస్టులను సంస్కరించి ప్రాయించేవరకు 16వ నంబరు నమూనా రైతులకు ఇవ్వాలనే ఉత్తర్వును రద్దు చేయమని ప్రభుత్వాన్ని కోరారు.

గ్రామోద్యోగుల పిల్లలకు ఉచిత విద్య [illegible] [illegible] [illegible].

## బ్యాంకులపై త్వరలో ఎక్కువ అజమాయిషీ

### వెంటనే జాతీయం చేయనక్కరలేదు

### ఆర్థిక మంత్రి శ్రీ గుహా ప్రకటన

న్యూఢిల్లీ, ఏప్రిల్ 27: బ్యాంకులను జాతీయం చెయ్యాలని ప్రజాసోషలిస్టు పార్టీ సభ్యుడు శ్రీ ఎం. ఎస్. గురుపాదస్వామి లోక్ సభలో ప్రవేశపెట్టిన తీర్మానాన్ని సభ్యులు తిరస్కరించారు.

తీర్మానాన్ని ప్రతిఘటిస్తూ, ఆదాయం, రక్షణ ఖర్చులమంత్రి శ్రీ ఎ. సి. గుహా ప్రస్తుతం బ్యాంకులను జాతీయం చేయడం సబబుకాదన్నారు. ఇంపీరియల్ బ్యాంకును జాతీయం చెయ్యడం వల్ల మొత్తం బ్యాంకుల వ్యాపారంలో నూటికి 23 వంతులు ప్రభుత్వపరం అయిపోయిందని గూడా ఆయన వివరించారు.

ఈ సందర్భంలో శ్రీ గుహా మరో విషయాన్ని గూడా తెలియజెప్పారు: బ్యాంకింగు కంపెనీల చట్టాన్ని సవరించడానికి త్వరలోనే ప్రభుత్వం ఒక బిల్లును తేబోతున్నది. యీ బిల్లులో బ్యాంకులమీద రిజర్వు బ్యాంకుకు మరింత అధికారం లభిస్తుంది. అదుపు అధికమవుతుంది.

"వ్యవసాయ పరపతి పరిశీలనసంఘం కొన్ని బ్యాంకులను వశపరచుకోవలసిందిగా ప్రభుత్వానికి సూచించారు. ఈ సూచనను ప్రభుత్వం స్థూలంగా ఆమోదించింది. వారు చెప్పిన ఆ బ్యాంకులను వశపరచుకోడాన్ని గూడా ఆలోచిస్తున్నాం. అందుకు సంబంధించిన బిల్లు త్వరలో పార్లమెంటులో చర్చకు రావచ్చు".

శ్రీ గురుపాదస్వామి తీర్మానాన్ని కమ్యూనిస్టులు బలపరిచారు. కాంగ్రెసు సభ్యులలో కొందరు బలపరిచారు. శ్రీయుతులు భగవత్ ఝా ఆజాద్, ఆచార్య డి. సి. శర్మ, ఈ ఇద్దరు కాంగ్రెసువారే, తీర్మానాన్ని బలపరిచారు. శ్రీ సి. పి. మాథ్యూస్, శ్రీ జార్జి థామస్ లు ప్రతిఘటించారు. వీరు కాంగ్రెస్ వారే.

ఈ తీర్మానాన్ని బలపరిచినవారు, వ్యాపారస్థులు నడిపే బ్యాంకులు అసమర్థంగా అవినీతిగా జరుగుతున్నాయన్నారు.

"దేశంలో 461 జాయింట్ స్టాక్ బ్యాంకులు వున్నాయి. ఇందులో 116 నష్టంతో నడుస్తున్నాయి. తక్కినవాటిల్లో 68 బ్యాంకులు వాటాదారకు లాభాలను ఇవ్వలేక పోతున్నాయి. స్వంతానికి లాభాలు చేసుకుందామన్న ఆలోచనలు తప్ప, ప్రజలకు సేవచేద్దామన్న ఆలోచనలేదు. రిజర్వుబ్యాంకువారి పరిశీలనవల్ల, తనిఖీలవల్ల పరిస్థితి బాగుపడటంలేదు. అదీకాక రెండో పంచవర్ష ప్రణాళికకు డబ్బు కావాలన్నా బ్యాంకులను జాతీయం చేయడమే మార్గం." అని శ్రీ గురుపాదస్వామి వాదించారు.

శ్రీ జార్జిథామస్ తీర్మానాన్ని ప్రతిఘటిస్తూ దేశ ఆర్థికాభివృద్ధికి బ్యాంకులు చాలా పనిచేశాయనీ, అందువల్ల వాటిని జాతీయం చేయడం అనవసరమని అన్నారు. శ్రీ మాథ్యూస్ బ్యాంకులను తగిన అదుపులో పెట్టవచ్చును గాని, జాతీయం చేయరాదని వాదించారు. శ్రీ భగవత్ ఝా ఆజాద్ బ్యాంకులు ప్రజల విశ్వాసాన్ని చూరగొనలేక పోయినాయని అన్నారు. బ్యాంకులు ప్రజలకు సేవచేయవలసినవిగాబట్టి వానిని సమాజాయత్తం చేయడం తగుపని ఆచార్య డి. సి. శర్మ వాదించారు.

శ్రీ ఫిరోజ్ గాంధి బ్యాంకుల డైరక్టర్ల మీద ఒక దాడిచేశారు. డైరెక్టర్లు పున్న నిబంధనలను వ్యతిక్రమించి, ఒకరిదగ్గర నుంచి ఒకరు అప్పులు తీసుకుంటూవుంటారనీ; ప్రభుత్వం ఈ విషయమై ఎప్పుడైనా రిజర్వు బ్యాంకుచేత పరిశీలన చేయించిందా అని అడిగారు.

అనంతరం శ్రీ అశోక్ చంద్రగుప్త చర్చకు సమాధానంఇస్తూ "ప్రభుత్వం సోషలిస్టు పద్ధతి సమాజాన్ని దేశంలో నెలకొల్పదలచుకుంది; మిశ్రమ ఆర్థిక విధానాన్ని సాధనమార్గంగా నిర్ణయించుకున్నది. ఈ సంగతి అందరికీ తెలుసు. ప్రభుత్వంగాని, పార్లమెంటుగాని వ్యాపారస్థుల రంగాన్ని తుడిచివేస్తామని అనుకోవడంలేదు. ప్రస్తుతం దేశంలో నూటికి 80 పాళ్లు జాతీయ సంపద ఈ వ్యాపారస్థుల రంగంలో ఉత్పత్తి అవుతున్నదని సభ్యులు తెలుసుకోవాలి" అన్నారు.

యుద్ధానంతరం చాలా బ్యాంకులు దెబ్బతిన్నాయి. ముఖ్యంగా పశ్చిమ బెంగాలులో మరీదారుణంగా పరిణమించింది. 1926 నుంచి ఈ బ్యాంకుల దివాళాలవల్ల 80 కోట్ల రూపాయలు నష్టమైపోయినాయి. ఇందులో బెంగాలులో 20 కోట్లు నష్టపోనాయి. యుద్ధానికి పూర్వం ఇన్ని బ్యాంకులు దివాళాలు తీసినట్లు కన్పించదు."

"బ్యాంకులు సమర్థంగా పనిచేయ్యటం లేదన్న విమర్శ గూడా ఒకటివుంది. జాతీయంచేస్తే, వాటిసామర్థ్యం పెరుగుతుందని సభ్యులు అంటున్నారు. [illegible] ఆసామర్థ్యం [illegible] చెయ్యవచ్చు. అంతేగాక ప్రభుత్వ రంగంలోగానే వ్యాపారస్థులకూ గాక పనిచేసేవారని మనం కోరుతున్నాం. ప్రభుత్వ రంగంలోనూ కొన్ని సందర్భాలలో అసామర్థ్య వ్యక్తం అవుతూవుంటుంది. గృహనిర్మాణ కర్మాగారం వ్యవహారం అందుకు ఒక ఉదాహరణం. అందువల్ల అసామర్థ్యం అన్నది ఒక వ్యాపారస్థుల రంగాన్ని ఆపేక్షించి వున్నదేకాదు, సర్వత్రా వుంటుంది."

"1951 నుంచీ బ్యాంకులమీద రిజర్వుబ్యాంకుకు కొన్ని అధికారాలు ఇచ్చి [illegible] సరిగా, మర్యాదగా నడిచేట్లు చూసే వలసిందని కోరాము. అప్పటి నుంచి ఏ పెద్దబ్యాంకూ దివాళా తీసినట్లు కన్పించదు. రిజర్వుబ్యాంకు ఈ బ్యాంకులను గట్టిగా అదుపులో వుంచుతున్నది. బ్యాంకుల్లో స్థితిగతులు బాగుపడుతున్నాయి."

"రెండో పంచవర్ష ప్రణాళిక సుష్ఠుగా అమలుపరచడానికి బ్యాంకులను జాతీయం చెయ్యాలని సభ్యులు సూచిస్తున్నారు. అందుకు లైఫ్ ఇన్సూరెన్సు కంపెనీలను జాతీయం చేసిన విషయాన్ని ఉదహరిస్తున్నారు. కాని భీమా కంపెనీలకు, బ్యాంకులకు వున్న తేడాలను సభ్యులు గ్రహించాలి. ఈ రెండు వ్యవస్థలమధ్య ఎంతో తేడా వుంది. భీమా కంపెనీలలో డబ్బు దీర్ఘకాల మూలధనంక్రింద వాడుకోడానికి అనువుగా వుంటుంది. బీమా ఈ కంపెనీలు ఆ మొత్తాలను అట్లా వినియోగించలేవు. బ్యాంకులలో డబ్బు అల్పకాల మూలధనం క్రిందనే ఉపయోగపడుతుంది. అందువల్ల అభివృద్ధి కార్యక్రమాలలో వినియోగానికిరాదు."

"బ్యాంకులన్నీ కలిసి 1954 లో మొత్తం రూ. 262 లక్షలు లాభాలను ప్రకటించాయి ఇందులో 1 కోటి ఇంపీరియల్ బ్యాంకు ప్రకటించింది."

"బ్యాంకులను సరియైన అదుపులో రిజర్వుబ్యాంకు పెట్టగలదనే మా అభిప్రాయం. అదీకాక ఈ బ్యాంకులు సరిగ్గా వ్యవహరిస్తాయని గూడా ఆశిస్తున్నాం. అవి సరిగ్గా నడవనప్పుడు పైన రిజర్వుబ్యాంకు వుండనేవుంది."

## దేశ శ్రేయస్సును గమనించి వ్యవహరించాలి

### ఆదోని పురపాలక సంఘ వజ్రోత్సవంలో మంత్రి సలహా

ఆదోని, ఏప్రిల్ 26: ఆదోని పురపాలక సంఘం వజ్రోత్సవం నిన్న జరిగింది. శ్రీ హెచ్. సీతారామరెడ్డి అధ్యక్షత వహించారు. సహకారశాఖమంత్రి శ్రీ సంజీవయ్య, స్థానిక పరిపాలనా శాఖమంత్రి డా॥ ఎ. బి. నాగేశ్వరరావు, స్థానిక పరిపాలనాశాఖ ఇన్ స్పెక్టర్ జనరల్ శ్రీ ఎ. రాఘవరెడ్డి మొదలైనవారు ఉత్సవాలకు వచ్చారు.

శ్రీమతి సూర్యకుమారి వందేమాతరం గేయం గానం చేశారు.

పట్టణాలలో వసూలయ్యే వినోదపు పన్ను మొత్తంలో నూటికి రు 20 లు ప్రభుత్వం తీసుకోవాలని నిర్ణయించారు కనుక ఈ పన్ను రేట్లను ఎక్కువ చేయమని కోరుతూ సహకారశాఖ మంత్రికి పురపాలక సంఘాధ్యక్షుడు శ్రీ హెచ్. సీతారామరెడ్డి విజ్ఞప్తి సమర్పించారు.

మంత్రులకు స్వాగతం చెబుతూ పురపాలక సంఘం చరిత్రను శ్రీ సీతారామరెడ్డి వివరించారు. 1-5-1865 న ఈ పురపాలక సంఘం ఏర్పడింది. 90 సంవత్సరాలయిన తరువాత వజ్రోత్సవం జరుపుతున్నారు. వజ్రోత్సవాలఖర్చుకు ప్రభుత్వం రు 5 వేలు మంజూరుచేశారు. మరికొందరుదాతలువిరాళాలు ఇచ్చారు. అన్ని ఖర్చులుపోను పది, పదిహేను వేలు మిగులుతవని అనుకొంటున్నారు. ఈ సొమ్మును పురపాలక సంఘ ఉన్నత పాఠశాల అభివృద్ధికి వినియోగిస్తారు. ఇప్పుడు స్థానిక పరిపాలనా శాఖ ఇన్ స్పెక్టర్ జనరలుగా వ్యవహరించుతున్న శ్రీ ఎ. రాఘవరెడ్డి ఈ పురపాలక సంఘం మొట్టమొదటి కమీషనరుగా 1884 లో పని చేశారని వివరించి కమీషనరు తదితర ఉద్యోగులు చేసిన కృషిని శ్రీ సీతారామరెడ్డి ప్రశంసించారు.

ఉత్సవాల ఏర్పాట్లలో సహకరించి నందుకు పురపాలక సంఘాధ్యక్షునికి నివేదికలో కమీషనరు శ్రీ జె. మోహనరావు కృతజ్ఞత చెప్పారు. నివేదికలో ఇంకా ఇట్లా ఉన్నది:

"తొంభై సంవత్సరాలు ప్రజాసేవ చేసిన తరువాత యీ పురపాలక సంఘం ఆంధ్ర తెలంగాణా ప్రాంతాలు కలిసి పోనున్న శుభసమయంలో వజ్రోత్సవం జరుపుకొంటున్నది."

"ఉత్సవాల నిర్వహణ సన్నాహాలు ఉత్సాహంగా మొదట ప్రారంభమైనా మధ్యలో కొంత నిరుత్సాహం కలిగింది. ఉత్సవాలు, కుటీర పరిశ్రమల ప్రదర్శన జరుగుతవని మేము ప్రకటించిన తర్వాత అనేక పెద్ద పట్టణాలలో ప్రదర్శనలు జరుగనున్నట్లు ప్రకటనలు వెలువడినవి. అయినా మేము నిరుత్సాహపడలేదు."

ఆ తరువాత విరాళాలిచ్చినవారికి కమీషనరు కృతజ్ఞత ప్రకటించారు. ఉత్సవాల అలంకరణకు బెంగుళూరు, బళ్ళారి, కర్నూలు, కుంభకోణం ప్రాంతాలనుంచి పనివారిని పిలిపించవలసి వచ్చిందని వివరించారు. ప్రదర్శనలకు వచ్చే నికరం ఆదాయాన్ని ఉన్నత పాఠశాల అభివృద్ధికి వినియోగిస్తామని చెప్పి, ప్రదర్శనలపై వినోదపు పన్ను మినహాయించమని ప్రభుత్వాన్ని అభ్యర్థించారు. విరాళాలు యిచ్చిన దాతలను ఈ సందర్భంలో సత్కరించే ప్రత్యేక సంచికలో ప్రకటిస్తామన్నారు.

వినోదపు పన్నురేట్లను ఎక్కువ చేయడం సాధ్యంకాదని వినతిపత్రానికి మంత్రి సంజీవయ్య సమాధానం చెప్పారు. వజ్రోత్సవాలను ప్రారంభిస్తూ పురపాలక సంఘం కృషిని శ్రీ సంజీవయ్య ప్రశంసించారు.

పురపాలక సంఘం ప్రజలకు అనేక సౌకర్యాలను ఏర్పాటుచేస్తున్నందుకు స్థానిక పరిపాలనాశాఖ మంత్రి డాక్టరు నాగేశ్వరరావు సంతోషం ప్రకటించారు.

వస్తుప్రదర్శనను స్థానిక పరిపాలనాశాఖ ఇన్ స్పెక్టర్ జనరల్ శ్రీ రాఘవరెడ్డి ప్రారంభోత్సవం చేశారు. పురపాలక సంఘం ఉపాధ్యక్షుడు శ్రీ ఎస్. తిమ్మన్న, కమీషనరు శ్రీ మోహనరావు వందన సమర్పణచేశారు.

## భద్రాచలక్షేత్ర అభివృద్ధి

### వేములవాడలో విద్యుచ్ఛక్తి

(స్వకీయ విలేఖరి)

హైదరాబాదు, ఏప్రిల్ 26: భద్రాచలంలోని శ్రీ రామాలయాన్ని రూ 2 లక్షలు వెచ్చించి అవసరమైన మరమ్మతులు ఇంతవరకు లేని సౌకర్యాలు గలిగించేటందుకు హైదరాబాదు ప్రభుత్వం నిశ్చయించిందని తెలుస్తున్నది.

రాష్ట్రంలోని ముఖ్యమైన క్షేత్రాలలో అభివృద్ధి కార్యాలు కొనసాగించి అసంఖ్యాకంగా వచ్చే యాత్రికులకు ఇతోధిక సౌకర్యాలు గలిగించాలని ప్రభుత్వం తలపెట్టింది. దీన్ననుసరించి వేములవాడ రాజేశ్వరస్వామి ఆలయంలో విద్యుచ్ఛక్తి ఏర్పాటు చేశారు. వేములవాడ పట్టణంలో కూడా విద్యుచ్ఛక్తి సరఫరాచేసే ప్రయత్నం జరుగుతున్నది.

## శ్రీ డి. సంజీవయ్య కార్యక్రమం

కర్నూలు, ఏప్రిల్ 27: సహకారశాఖ మంత్రి శ్రీ డి. సంజీవయ్య, మే 1వ తేదీ, రాయదుర్గంలో గ్రామీణ బ్యాంకుకు ప్రారంభోత్సవం చేయడానికి వెడతారు. ఆ రాత్రికి తిరిగి వస్తారు.

తిరిగి 28న విజయవాడ, 30వ నర్సారావు పేటలకు వెళ్ళి 1వ తేదీ కర్నూలు యిక్కడికి వస్తారు.

మళ్లా 2వ తేదీ విజయవాడకు బయలుదేరి వెడతారు. 3, 4, 5 తేదీలలో అక్కడ ఉంటారు.

## నాగులపంచలో 60 ఇళ్లు దగ్ధం

జగ్గయ్యపేట, ఏప్రిల్ 27: జగ్గయ్యపేట తాలూకా, 'నాగులపంచ' గ్రామంలో నిన్న సాయంత్రం సుమారు అరవై యిండ్లు దగ్ధమైపోయినవి. ప్రథమంగా హరిజనవాడలో వ్యాపించిన అగ్ని తరువాత, గ్రామంలో ఒకవైపుకి అంటుకొని [illegible] [illegible] గాయపడ్డారని తెలిసింది [illegible] వుండవచ్చునని అంచనా.

(స్వ. వి.)

